# శ్రీరఘురామ శతకము

( కంద పద్యములు )




రంగన్న గారి సాయులు



# శ్రీ రఘురామ శతకము

(కంద పద్యములు)

❁

రచన: రంగన్న గారి సాయులు

❁



❁

ప్రచురణ: 2002

❁

ప్రతులకు:
రంగన్న గారి సాయులు,
ఇ.నెం. 2-2-24, భారత్ రోడ్,
కామారెడ్డి - 503 111, జి॥ నిజామాబాద్.

❁

ముద్రణ:
చైతన్య ఆఫ్‌సెట్ ప్రింటర్స్,
కామారెడ్డి - 503111.
ఫోన్: 23614.

❁

మూల్యం: రు॥ 25/-





రంగన్న గారి సాయుయు సతీమణి శ్రీమతి నాగమణి

కృతి వ్రాయగ కృతి కర్తను

కృతిభర్త్రగధర్మపత్ని - కృతి చేకొనగా !

హితమాయెను సతిపతులకు

సతతము మా నోట "వాణి" చక్కగ బలుకున్ !

Jnanpith Awardee
**Dr. C. Narayana Reddy** M.P.
M.A. Ph.d. D.Litt.
CHAIRMAN
**Andhra Pradesh State Cultural Council**
**Government of Andhra Pradesh**
Kalabhavan, Hyderabad - 500 004
Phone · (O) 3214603 (R) 3548451
Fax (O) 3214603

జ్ఞానపీఠ అవార్డు గ్రహీత
**డా॥ సి. నారాయణరెడ్డి,** ఎం.పి.
ఎం.ఏ. పి. హెచ్. డి. డి. లిట్.




# అభినందన

తెలుగులో భక్తిప్రధాన శతకాలు శతసహస్రాధికంగా వెలువడ్డాయి. భక్తికి పరిధి లేదు కదా. శ్రీరామభక్తిని ప్రధాన వస్తువుగా స్వీకరించిన శతకశ్రేణిలో ఈ 'శ్రీ రఘురామ శతకం' ఒకటి.

ఈ రచయిత రంగన్న గారి సాయులు తన కవిత్వానికి జనన మూలమేమిటో ఈ శతకంలోని నాలుగో పద్యంలో చాలా అందంగా చెప్పాడు. కలాన్ని కవ్వంగా చేసి ఆలోచనల తాటితో మనసులోతుల్లో తిప్పుతూ వుంటే ఈ శతక కవిత ఉదయించిందంటాడు. మరొక పద్యంలో అకళంకమైన కవిత్వమే ఒక కల్ప వృక్షమని ముగ్ధమతితో అంటాడు.

సాయులు గారి కందరచనలోని శైలి ధారాధురీణంగా సాగింది.

శ్రీరామునిపట్ల తనకున్న భక్తితత్పరతను పద్యరూపంలో ప్రకటించిన రంగన్న గారి సాయులు గారికి నా అభినందన.

డా॥ సి. నారాయణరెడ్డి

# మనవి మాటలు

అలవోకగా వ్రాసినవికొన్ని, అదేపనిగా వ్రాసినవికొన్ని కట్టుబాటుకు శిరసొగ్గి వ్రాసినవికొన్ని, మొక్కుబడిగా మరికొన్ని ఇలా ఎన్ని? ఇంకెన్ని? శతం శతాధికం !

భావమొకవంక, భాషవొకవంక ఊపిరాడక వుక్కిరి బిక్కిరి చేసినప్పుడు ఉద్భవించినవి కొన్ని లేకపోలేదు. ఉష్..! పద్యమేనా అన్న వాళ్ళున్నట్టే; ఓహో! పద్యమా అన్న వాళ్ళున్నారు. పెదవి విరిచే వాళ్ళే పెదాలతో ముద్దెట్టుకుంటారు. కానని వాళ్ళే కళ్ళకద్దుకుంటారు. ఒప్పనివాళ్ళేహృదయానికత్తుకుంటారు. పద్యానికున్న పుట్టుబలం అలాంటిది. పద్యంపలుకుతుంది. పలికిస్తుంది. పదం సంజీవి - పద్యం చిరంజీవి.

ప్రకృతినిగాంచి పరవశించనిప్రాణిలేదు. ప్రాణికోటి సమస్తము ప్రకృతి గుణగణములనే కొనియాడుచున్నది. ఇందులో ప్రధానమైనది; విలక్షణమైనది కవిత్వము. కవిత్వమునకు భక్తిమూలబీజమువంటిది భక్తి శతకములు పూర్వీకులనేకులు వ్రాసియున్నారు. దాస్యభక్తి, సఖ్యభక్తి, వాత్సల్యభక్తి, మధురభక్తి భగవంతునిపై భక్తునికి గల విశ్వాసమును చాటుచున్నవి.

శ్రీరఘురామ శతకము భక్తి ప్రామాణికముగానే భావించి రచించితిని. ఇది ద్వితీయ సంపుటి. నవ్య కవిత్వమునకు వన్నె తెచ్చుననెడు నమ్మకం నాకున్నది. పాఠకలోకం నన్నాదరించి ఛందోబద్ధమైన మందహాసం చేస్తుందనే నా భావన. సుకవితా సామ్రాజ్యమేలుకొనుటకు కాలమనుమతించినశుభఘడియలివి మీకూశుభంకలగాలని నాకాంక్ష - ఆకాంక్ష. శ్రీరఘురామ శతకం పుస్తకము సి.నా.రె కరకమలముల కందించి వారిని అభిప్రాయం వ్రాయవలసిందిగా కోరాను. చిరునవ్వు నొకటి నావంక విసిరికాస్సేపు పుస్తకంలోని వొక్కోపేజీనే తిప్పుతూ చాలా బాగా రాశారు అంటూ మెచ్చుకోలు పలికారు. 'అభినందన' తెలిపారు. కృషి ఫలించినది కృతజ్ఞుణ్ని. నావంతు పని పూర్తిచేశా ఇక మీవంతు ఏదీ. చదివి చెప్పండి. విశ్రమించడానికిది సమయం కాదు.

అందంగా అచ్చువేసిన శ్రీ మధుసూదనరావు గారికి, ఛాయా చిత్రకారులు శ్రీ న్యూ జ్యోతి ఆర్ట్ స్టూడియో గారికి కృతజ్ఞతలు.

**రంగన్నగారి సాయులు.**



# శ్రీరఘురామ శతకము

కం॥ శ్రీరామ సత్కృ పామృత
మే రసరమ్యత నొసంగి మెలమెల్లగనా
లోరచనాసక్తినిపెం
చేరీతుల తేటపరచె శ్రీ రఘురామా ! 1

కం॥ తలచెద తల్లిని తండ్రిని
తలచెద నినునన్ను కన్న ధాత్రినియెపుడున్
కొలిచెద గురువును వేల్పును
చెలువంబగుమెప్పులంది శ్రీరఘురామా ! 2

కం॥ ఒజ్జవు నీవని తలచెద
ముజ్జగ ములపూజలందు ముద్దుగణేశా
అజ్జా! మరుగుజ్జా యెద
సెజ్జాపై బవ్వళించు శ్రీరాఘురామా ! 3

కం॥ కలమే కవ్వముకాగా
తలపోతల త్రాడుచుట్టి దండిగయెదలో
తులలోత్రిప్పుచునుండగ
చెలువంబగు వాణిబుట్టె శ్రీరఘురామా ! 4

కం॥ అంజలి జేయుచు నుంటిని
రంజితమగుపదములొసగి రక్షింపగదే
మంజులమగు భావంబులు
శింజితమై మ్రోగునట్లు శ్రీరఘురామా ! 5

కం॥ అక్కడ యిక్కడ దక్కెను
చక్కనినాతండ్రిపేరు చాటువు వలెనే
మక్కువతోపిలచి నపుడె
చిక్కెనునావాక్కులోన శ్రీరఘురామా ! 6

కం॥ శతకములెన్నియు జదివిన
మతిమంతుడు గాకయుండు మతిహీనతచే
మతులే శతకములైనచొ
జతపడు మనుజుల మనసులు శ్రీరఘురామా ! 7

కం॥ శరణని తలవంచితి నా
దురిత గుణసమూహమెల్ల తొలగించుమయా
పరమదయా నిధివైబహు
సిరిసంపద లిచ్చికావు శ్రీరఘురామా ! 8

కం॥ కవివాక్కుకంటెతియ్యన
భువిపైవెదుకంగలేదు భూపతికైవన్
భవదుఃఖముల్ తొలగి, దృ
ష్టి విశేషజ్ఞానమిచ్చు శ్రీరఘురామా ! 9

కం॥ రారా! శ్రీరామయనుచు
నోరారగ పిలచినంత నోటికినుడుగై
నేరుగ నాయింటికి దరి
జేరగ కడువేగరమ్మ్మ శ్రీరఘురామా ! 10

కం॥ భువిజనులొప్పని చదువులు
భువిజనులకు కీడుదెచ్చు బుద్ధిగయెపుడున్
భువిజను లొప్పిన చదువులు
శివకరమై నిల్చివెల్గు శ్రీరఘురామా ! 11

కం॥ సకలార్థంబులు గూర్చెడు
అకలంకంబగు కవిత్వ మబ్బినచాలున్
ఒకకల్పవృక్షమే, కో
రికలకు మారాకు లొత్తు శ్రీరఘురామా ! 12

కం॥ తెలసీ తెలియని వారతి
తెలివిగ నటియించు చుంద్రు తెలసినవారే
లలితమనస్కులుగా, రం
జిలుచును జీవించుచుంద్రు శ్రీరఘురామా ! 13

కం॥ తీయని విడదీయని యెడ
బాయనిదే బంధమౌను పరమోన్నతమౌ
ధ్యేయము మొగ్గై దొడిగిన
శ్రేయస్సుల పంటపండు శ్రీరఘురామా ! 14

కం॥ ఎరుగని వారల నడిగిన
ఎరుకపడునె మంచి-చెడ్డ యిసుమంతైనన్
దొరకునె మడుగున వెదికిన
చిరుముత్యం బొక్కటేని శ్రీరఘురామా ! 15

కం॥ క్షేమము గూర్చెడు వాడవు
క్షామంబును గలుగనీకు కాపాడగ, వే
రే మాకు దిక్కెవరు, లే
రే మామొరనాలకింపు శ్రీరఘురామా ! 16

కం॥ సర్వము నీవై యుండగ
నిర్వీర్యం బేలకలిగె నీబలమే నా
సర్వస్వంబని నమ్మియు
చెర్వొడ్డున చేపనైతి శ్రీరఘురామా! 17

కం॥ వినిపించియు, కనిపించుయు
కనినంతయె మాయమౌను కడకేమిటికో
అనిపించిన దంతయు, చూ
చినకొలదిగ యాశపుట్టు శ్రీరఘురామా! 18

కం॥ కుశలంబను మాటకు పలు
దిశలను చూపింతువేల? దారులువేరా?
విశదంబుగ వివరింపుము
శిశువుగ చెవియొగ్గివిందు శ్రీరఘురామా! 19

కం॥ కులమున బుట్టినయంతనె
కులదీపకుడగుటకల్ల గుణకోవిదుడై
కుల పెద్దలు గొనియాడిన
చెలువంబగువాని బ్రతుకు శ్రీరఘురామా ! 20

కం॥ భువిపై భూపతివై, నా
భవబంధములెల్లద్రుంచి పాలించు మయా
శ్రవణానందంబుగ, శ్రీ
శివతత్వము పిప్పిచెప్పు శ్రీరఘురామా ! 21

కం॥ తృష్ణను ద్రుంచకపోయిన
నిష్ణాతుడు కాడుచూడ నిండుమనసుతో
తృష్ణను విడనాడిన, వ
ర్ధిష్ణుండను పేరుగాంచు శ్రీరఘురామా ! 22

కం॥ శ్రీకారము శుభకరమగు
సాకారము సహకరించి సౌఖ్యముగూర్చున్
లోకులకితమొనరించిన
చేకూరును కీర్తిపెంపు శ్రీరఘురామా ! 23

కం॥ అభిరాముడవైచెలగుచు
శుభములు నాకీయకున్న చోద్యముగాదా?
అభిమానమువీడక, కో
రిభజింపగ బూనుకొంటి శ్రీరఘురామా ! 24

కం॥ స్వరమై స్వరమాధురివై
వరమై వరదుడని పించు వహ్వా! యనగా!
విరివై విరితేనియవై
చిరుపద్యములందునింపు శ్రీరఘురామా ! 25

కం॥ సుఖమై సుఖాంతరమ్మై
ముఖమై మున్ముందుకేగి ముఖవచనమునై
అఖిలానందమునై హిమ
శిఖరాగ్రము చేరుకొందు శ్రీరఘురామా ! 26

కం॥ తలవ్రాతలదలచుకొనుచు
తలవంచుక దిరుగుచున్న తాపముగలుగున్
తలలెత్తుక నిలుచుండిన
శిలలైనను బూజలొందు శ్రీరఘురామా ! 27

కం॥ పరపీడలదొలగించుచు
పరహితమొనరించువాడె పరమాత్ముండౌ
పరులనుగనివైదొలగిన
చిరునామయె వెక్కిరించు శ్రీరఘురామా ! 28

కం॥ కప్పిన విప్పక తప్పదు
తప్పొప్పులవిప్పిచెప్పు తప్పనిసరిగా
మెప్పులగొప్పలు ముత్యపు
చిప్పల కుప్పలనియొప్ప శ్రీరఘురామా ! 29

కం॥ కరువై కనుమరుగై యెద
బరువై సహనమునశించె బాధలకొండల్
కరిగే సూత్రము చెవిలో
శిరముంచి వచింపువేగ శ్రీరఘురామా ! 30

కం॥ ఖనివై గనివై వనివై
కనిపించుము కనులముందు కలమైకవితై
తనువైమనువై మనసై
చినుకై ముత్యమ్ముగమ్మ శ్రీరఘురామా ! 31

కం॥ ఇచ్చుకొను వారలుండిన
పుచ్చుకొననివారుగలరె? పుణ్యస్థలిలో!
మచ్చిక ముచ్చటలాడగ
జెచ్చెర నాకడుపునిండు శ్రీరఘురామా ! 32

కం॥ అన్నా! అన్నన్నాదెలి
వున్నదెలసికొనగనైతి వోటమిగాదా?
మన్నా-మిన్నానున్నలె!
చిన్నా నాదన్నదేది? శ్రీరఘురామా ! 33

కం॥ నమ్ముకొనినవాడెవ్వడు
అమ్ముకొనడు తననుదాను అట్లగునేనీ
కొమ్మను వీడేప్రతిపూ
రెమ్మలకును తావిచేదు! శ్రీరఘురామా! 34

కం॥ హితుడై సంశోభితుడై
కృతకృత్యుండైసుఖించు-కృపలక్షణుడై
వ్రతుడై సంసేవితుడై
జితుడై సచ్ఛీలుడౌను శ్రీరఘురామా! 35

కం॥ అండగ నీవుండగ, నా
గుండెయె వొకనిండుకుండ కొండంతటి దా
వుండగ గూండాలను, నే
చెండాడెద భూమినిండ శ్రీరఘురామా! 36

కం॥ నవ్యంబులు దినచర్యలు
దివ్యంబులు జేయబుద్ధి దినదినమునకున్
భవ్యంబులు ఫలితంబులు
సేవ్యంబులు శ్రమకునిండు శ్రీరఘురామా! 37

కం॥ ముట్టకు తిట్టకుకొట్టకు
మట్టిది కనికట్టు వట్టి మాయలుగావా ?
అట్టిది యెట్టిగ బుట్టిన
చెట్టుకు మొదలంటుగట్టు శ్రీరఘురామా! 38

కం॥ అవసర మెరుగని సోమరి
అవకాశము జారవిడుచు అజ్ఞానముచే
నవతను కోరని బ్రతుకే
చివికిన వస్త్రంబు గాదె శ్రీరఘురామా! 39

కం॥ అజ్ఞానము నశియించును
సుజ్ఞానుల చెలిమిజేయ సుఖములు బడయున్
ప్రజ్ఞా పాటవ మబ్బును
జి జ్ఞానను బెంచుకొన్న శ్రీరఘురామా! 40

కం॥ ఎంచిన మంచిని విడచిన
పంచనబడి యున్నపెక్కు బాధలుకలుగున్
అంచిత మౌమంచి విస
ర్జించనపుడె కలుగు సుఖము శ్రీరఘురామా! 41

కం॥ వరమిచ్చిన వరదుడవని
వరమీయకదప్పుకొన్న వరదుడగావా ?
బురదంటిన రతనము, సు
స్థిర తేజము దాచగలదె శ్రీరఘురామా! 42

కం॥ మడిమత్రిప్పనిశౌర్యము
మడిగట్టుకయున్నదేమి మౌనవ్రతమా ?
తడిగుడ్డతొ గొంతులు గో
సెడు వారల గూల్చుమయ్య శ్రీరఘురామా ! 43

కం॥ దొరలకు దొరవని నమ్మితి
దొర తనమును జూపుమయ్య దుఃఖాంబుధిలో
దొరలే వారల మొరవిని
చిరు మమతల పడవజూపు శ్రీరఘురామా ! 44

కం॥ కులవృత్తి నభ్యసింపక
కుల బురుషున కైననేమి కూడింతయు ఈ
ఇల పై బుట్టదు తథ్యము
చెలువారని కులములేల ? శ్రీరఘురామా ! 45

కం॥ పగటి కలలు కనినంతనె
ప్రగతి పథముకానరాదు పై పై వన్నెల్
వెగటని పించిన పిదపే
చిగురించును జీవితాలు శ్రీరఘురామా ! 46

కం॥ వత్సా! యని నను బిలువుము
మత్సర ములుదొలగిపోవు మదిలో నవరా
దిత్సగ వెలుగొందెడు నా
చిత్సముఖయశఃప్రకాశ శ్రీరఘురామా ! 47

కం॥ తేనియ లుడిగిన పూవౌ
మానసివిశ్వాసముడుగ మనుజుల కిలపై
నేనను దురహంకారము
చేనాశం బౌనుగాదె ! శ్రీరఘురామా ! 48

కం॥ నిఃఖేదుడవని కొలచితి
దుఃఖంబులుదొలగజేయు తొందరగా శ్రీ
నఃఖండన వాసా, కీ
ర్తిః ఖద్యోతుడవు నీవె శ్రీరఘురామా ! 49

కం॥ గహ్నోవేశము తోడుత
రహ్నాంబగుజీవితాలు రమణులకిల పై
వహ్ని కణంబగు సీతయె
చిహ్నాంబై నిల్చివెల్గె శ్రీరఘురామా ! 50

కం॥ దుగ్ధము గ్రోలిన నాడే
ముగ్ధుడనై మురసిపోతి మున్ముందుగ ల
బ్రగ్ధత్వము నొసగి నను
స్నిగ్ధ హృదయుడనవిబిల్వు శ్రీరఘురామా ! 51

కం॥ అద్భుతమగు నీలీలలు
ఉద్బోధలు జేయునయ్య ఉత్సాహముతో
సద్భావన వర్ధిల్లగ
చిద్భామానందమౌర శ్రీరఘురామా ! 52

కం॥ శాస్త్రము లెన్నియు జదివిన
శాస్త్రజ్ఞానంబెయబ్బు సంశయమేలా?
శస్త్రాస్త్ర విద్య లెరిగిన
స్త్రీస్త్రీధనమెట్లు పొందు శ్రీరఘురామా ! 53

స్త్రీధనము:- ఇదిషడ్విధము

1. అధ్యగ్నికృతము
2. అధ్యాహవనికము
3. ప్రీతిదత్తము
4. భ్రాతృసాదాయికము
5. మాతృసాదాయికము
6. పితృసాదాయికము

కం॥ కర్మాచరణం బందున
ధర్మంబును విడువరాదు దలతెగి పడినన్
మర్మ మరసి నడచిన బ
ర్హిర్ముఖుడైబూజలందు శ్రీరఘురామా ! 54

కం॥ మన్ను తినిన వాడేనట
కన్నులలో వెన్నదొంగ కనువిందుగ లో
కన్నులు తెరిపించిన శ్రీ
చిన్నారుల కన్నదొంగ శ్రీరఘురామా ! 55

కం॥ విశ్వాసము మదినిండిన
విశ్వంబర చేతనుండు వివరింపగ లో
కేశ్వరుడు సహకరించిబు
షీశ్వరుని గదిద్దుకొన్న శ్రీరఘురామా ! 56

కం॥ జ్ఞానమె బ్రహ్మానందము
జ్ఞానామృతమే మధురము జ్ఞానికి యెపుడున్
జ్ఞానమె శాశ్వతమని దల
చిన వాడే ధన్యుడౌను శ్రీరఘురామా ! 57

కం॥ శతకోటి మాటలుండగ
మతి దప్పిన మాటలేల? మౌనమెమేలౌ!
మతి గలిగి మాట లాడిన
జితేంద్రియు డనంగజెల్లు శ్రీరఘురామా ! 58

కం॥ హెచ్చుగ లాయర్లుండిన
పచ్చి నిజంబైననేమి పాడైపోవున్
హెచ్చిన మంచితనమె ము
చ్చిచ్చున బడద్రోసివేయు శ్రీరఘురామా! 59

కం॥ పరువము దెచ్చెడు వన్నెలు
పరువము దాటిన నశించు ప్రభువుల కైనన్
పరువము నమ్మగ రానిది
చెరువున యలలాడినట్లు శ్రీరఘురామా! 60

కం॥ కొండల నెక్కుచు దిరిగిన
కొండంతటి వాడుకాడు గుండాయిజమున్
చెండాడిన శుభదినమున
జెండాలకు వన్నె దెచ్చు శ్రీరఘురామా! 61

కం॥ అడవిన బుట్టిన తరువులు
పుడమికి బహుశోభనిచ్చు పురవాసులకున్
కడుమే లొనరింటుట గని
చెడుకృత్యము జేయరాదు శ్రీరఘురామా! 62

కం॥ రాతిని నాతిగ జేసియు
రాతిగ మారితి వదేల? రాతిని దలపిం
చే తలపుల నాల్కవగుచు
చేతల జెలువొంద వేమి? శ్రీరఘురామా! 63

కం॥ అంతట కలియుగ జూసిన
అంతరమునకొర్కెలూరె అదియిదియనుచున్
భ్రాంతికి లోనైతిని ని
శ్చింతకు సన్మార్గమేది ? శ్రీరఘురామా! 64

కం॥ నీతికి తరగతు లాయెను
కోతికి పట్టంబుగట్ట కొంపలుగూల్చెన్
రాతిరి పగలాయెను దు
ర్నీతుల కికరెక్కలొచ్చె శ్రీరఘురామా! 65

కం॥ నుడుగై అడుగై గొడుగై
అడుగుడుగున తోడురమ్మ అయ్యవు గావా?
కడువేడుకతో నిను గొ
ల్చెడి భాగ్యం బబ్బె నాకు శ్రీరఘురామా! 66

కం॥ క్రమ మెరిగి జేయు పనులే
సమదృష్టికి తేజమిచ్చి సౌఖ్యములొసగున్
మమకారము మది వీడక
చెమటోడ్చిన భాగ్యశాలి శ్రీరఘురామా! 67

కం॥ కనుగానని కామంబున
పెనుజీకటిలోన జిక్కి వేసారితి నా
కను తేజో జ్ఞానము ని
చ్చినా కొక త్రోవజూపు శ్రీరఘురామా! 68

కం॥ దయజాడగ దయ జేయుము
దయగల వాడవని నమ్మి దలపగ మనసై
నియమముతో కొలచితి స
త్క్రియలకు సత్ఫల మొసంగు శ్రీరఘురామా! 69

కం॥ చక్కని వాడవటంచును
మక్కువతో నిను దలపగ మనసాయెను పెం
పెక్కిన భక్తి వొకటె చే
జిక్కగ ధన్యుండనైతి శ్రీరఘురామా! 70

కం॥ నానా దుర్వ్యసనములకు
లోనైతిని మంద బుద్ధిలో బడి చెడితిన్
దీనుని మనోవ్యధలు నీ
చే నయమనిపించి మాన్పు శ్రీరఘురామా! 71

కం॥ తక్కువ వాడనని కదా
మక్కువ జూపంగరావు మనసే లేదా
చిక్కుల నెడబాపగ పెం
జిక్కుగల దటయ్య నీకు శ్రీరఘురామా! 72

కం॥ బిందువు కందము గలదా?
అందమునకు రూపు తొడిగి ఆకర్షితమౌ
బిందువు ప్రతిబింబములై
చెందును పరివర్తనమ్ము శ్రీరఘురామా! 73

కం॥ కలవాడై బుద్ధి బలము
గలవాడై కార్య దీక్ష గలవాడై ని
శ్చలుడై సద్భక్తి చె రం
జలువానికి కొదువగలదె శ్రీరఘురామా! 74

కం॥ లెమ్ము కడువేగ రమ్మిక
నెమ్మనమున నిమ్మి కొలువ నీవే నిజమౌ
కమ్మని దయారసము విర
జిమ్మగ వెనుకాడనేల? శ్రీరఘురామా! 75

కం॥ పరులెవ్వరు తన వారె
వ్వరు జీవాత్మ పరమాత్మ పలుకగ వేరె
వ్వరు కానరారు సమదృ
ష్టి రూపు ధరియించె నేని శ్రీరఘురామా! 76

కం॥ మడియా చారము లేటికి
విడువక భజియించెనేని విమలాత్ముండౌ
కడు వేడుకతో తరియిం
చెడు వాడే భక్తిపరుడు శ్రీరఘురామా! 77

కం॥ శక్తికి మించిన కార్యము
యుక్తితొ సాధించెనేని యోగ్యుండని ఆ
సక్తుండని లోకులు ని
ర్ణిక్తామే యుడని యంద్రు శ్రీరఘురామా! 78

కం॥ పావన మగునీ నామము
భావము నందున భజింతు భళిరాయనగా
కావగదే ప్రియ్యమారగ
జీవయశఃప్రభలుజిమ్మ శ్రీరాఘురామా! 79

కం॥ ఇటుజూసిన యటుజూసిన
ఎటుజూసిన నీవె దిక్కు యిహపరములకున్
పటుతరముగ కనుగొని నే
చిటికెలు వేయంగజూడు శ్రీరాఘురామా! 80

కం॥ గవ్వల వలెబడి యుండిన
బువ్వకు తానోచకుండు బుద్ధిగ యెపుడున్
రవ్వల వలె వెలుగొందిన
జివ్వున దరి జేరుశ్రీలు శ్రీరాఘురామా! 81

కం॥ కలవారము బద్ధి బలము
గలవారము భుజబలంబు గలవారము వా
గ్బలము మనోబలము చె రం
జిలు తెలుగుజనులము మేము శ్రీరాఘురామా! 82

కం॥ రవితేజము భువికందము
కవిముఖ వచనంబులెన్నొ కరుణకు నెలవై
నవతయు సమతయు రెండును
శివకరమని యెంచవలయు శ్రీరాఘురామా! 83

కం॥ తనువుండిన మనసుండును
మనసునకే తనువుతోడు మమతల నెలవై
మనసొప్పగ తనువే తెం
చిన కార్యమె శుభ మొసంగు శ్రీరాఘురామా! 84

కం॥ నిత్యానందము కొరకై
సత్యాన్వేషణము జేయ సౌఖ్యంబును ఔ
న్నత్యం బొనగూడును ఔ
చిత్యం బగుజ్ఞానమదియె శ్రీరాఘురామా! 85

కం॥ జనమెరిగినదే సత్యము
జనమెరిగిన ధర్మమదియె జనులకు మేలౌ
జన సాంప్రదాయములు మె
చ్చిన సభ్యత కాటపట్టు శ్రీరాఘురామా! 86

కం॥ ఎత్తుల చేనార్జించిన
ఉత్తముడని రాదు పేరు వాకమారైనన్
ఎత్తులు దావిడనాడిన
జిత్తాభ్యున్నతిని బొందు శ్రీరాఘురామా! 87

కం॥ తలపున మధురిమ లుండిన
తలలో నాలుకలు సాచి తాతల నైనన్
బలుకుచు బలికించిన చో
చెలిమి కలిమి కలసి వచ్చు శ్రీరాఘురామా! 88

కం॥ కలమే జీవాధారము
కలమే నా బలము ధనము గనులకు విందౌ
కలమే జీవిత ధ్యేయము
చెలువొందగ సంతసింతు శ్రీరాఘురామా! 89

కం॥ అలుగుట కూడదు యెక్కువ
అలుగుట చేవచ్చు కీడు ఆర్యులకైనన్
అలుగుట తప్పని దెలిసిన
చెలికారము వృద్ధిజెందు శ్రీరాఘురామా! 90

కం॥ కలలో గాంచిన రూపము
ఇలపై జూడంగలేడు ఈశ్వరుడైనన్
కలలే నిజమై పండిన
చెలువం బొప్పగ సుఖించు శ్రీరాఘురామా! 91

కం॥ నీ సరి దైవము లేదని
దాసుడనై వేడుకొంటి దండిగ మదిలో
వేసారక నను గావుము
చేసెద యభివందనంబు శ్రీరాఘురామా! 92

కం॥ అందము బంధము వేయును
విందుల వలె రుచులు నింపి వెర్రిని జేయున్
డెందము పరుగులు బెట్టిన
చిందులు వేయంగరాదు శ్రీరాఘురామా! 93

కం॥ కించెత్ భోగంబుల బడి
మంచిని మదిదలప లేదు మచ్చున కైనన్
ఇంచుక నాపై దయబ్రో
క్షించిన నదియే వరమ్మ శ్రీరఘురామా! 94

కం॥ ఎంతగ నిన్నే దలచిన
కొంతైనను బ్రోవవేమి? కోపమె నాపై
పంతంబులు సడలించుచు
చింతల నెడబాపుమయ్య శ్రీరఘురామా! 95

కం॥ ముష్కరులనగా నెవ్వరు?
దుష్కర్మల నాచరించు దుర్గుణములచే
శుష్కించుచు నుండెడు మ
స్తిష్కమ్ముల కెవరు దిక్కు శ్రీరఘురామా! 96

కం॥ తరతమ భేదము నెరుగక
పరమ దయా సుగుణశీలి పసి పాపవలెన్
మురియుచు తామురి పించును
చిరునవ్వుల జల్లు వోలె శ్రీరఘురామా! 97

కం॥ కనగలిగిన కన్నందము
అనగలిగిన నోరె గొప్ప ఔనని యొప్పే
వినగల చెవులందము నో
చిన బుధజన గణము లొప్ప శ్రీరఘురామా! 98

కం॥ పలికెద నీ నామము
తెలిపెద నీలీలలెన్నొ తేకువతోడన్
కలిపెద నిరువురి నొకటిగ
చెలికారము మీదయాన శ్రీరఘురామా! 99

కం॥ నవ్వించుట నేర్చుకొనుము
నవ్వించుట వలన మెప్పు నలుగురిలోనన్
నవ్వే కడు ప్రీతికరము
జివ్వన నీవైన నవ్వు శ్రీరఘురామా! 100

కం॥ మతిగలిగిన గతిగలుగును
మతియు గతియు రెండు మంచిని బెంచున్
ప్రతి వాడీ రీతిగ ని
శ్చితముగదల పొసెనేని శ్రీరఘురామా! 101

కం॥ నీవే నేనను భావన
నావాడవు నీవెయన్న నమ్మక మేగా
దేవా! నను దయ జూడము
సేవకుడను నీకు నేను శ్రీరఘురామా! 102

కం॥ పరమానందము నొందితి
విరచించితి పద్యములను వినయముతో నీ
కరుణామృత పానముచే
స్థిర చిత్తుడ నైతినిట్లు శ్రీరఘురామా! 103

కం॥ ఒప్పును పద్యములందున
తప్పక కడుమోదమౌను స్తవనీయం బౌ
మెప్పొనరింపగ జనులకు
చెప్పితి నేనీ విధంబు శ్రీరఘురామా! 104

కం॥ జనులందరు వినయముతో
వినిపింపగ రామకోటి విశ్వాసముతో
వినుతింపగా దలచి కొల
చిన వారే భక్త కోటి శ్రీరఘురామా! 105

కం॥ కవితామృతమును బంచగ
కవి వాక్కులై చాల మేలు కవులందరకున్
భువిజనుల కందజేయగ
శివకరమై శతకమొప్పె శ్రీరఘురామా! 106

కం॥ అక్షర మాలిక లివిగో
లక్షణముగ యల్లినాడ లచ్చికి మగడా!
చక్షువులను దెరువుము నీ
శిక్షణ పరిపక్వమయ్యె శ్రీరఘురామా! 107

కం॥ మంగళ దీప్తులు భాసిల
మంగళ గీతాలుబాడి మనసున మమతై
మంగళ మహశ్రీయని నీ
చెంగిట బడిమ్రొక్కనేర్తు శ్రీరఘురామా! 108